మైమఱచి నిద్రించుచున్న మీకు ఈసౌధంబున జరుగుచున్న విపరీతంబు లేమి తెలియునురా ?

భువ—ఛీ! వదరుఁబోతా! నోరుమూసికొనుము లేకున్న పండ్లురాలఁ గొట్టించెదము.

రంభ—ఎవడవురా నీవు? నీయూరు పేరు లేమి?

జయం—అదంతయు నీకేటికి? నీపని నీవు చూచుకొనుము.

మొ-భ—అరే! సాధువృత్తినున్న కిరాతా! నిష్కారణముగ రాజకుమారుని చంపితివేమిరా?

భువ— నామనోహరుని జంపి నామానభంగము చేయవలెనని తలంచినాఁడు.

జయం— (చెవులుమూసికొని)నారాయణ! నారాయణ!! (కోపముతో)

కమాచి-ఆటతాళము.

పాపాత్మురాలా! ఛీ! ఛీ- కోపమాఱఁద్రుంచెదర॥ పా॥
పాపమనక కల్లలాడెదే?- ధర్మసంహారిణీ॥ హారిణీ॥ పా॥
వానినే నేనఁటే చంపితినే - పాపాత్మురాలా! చాలునోర్మూసికో॥ పా॥

భువ—భటులారా! నోటికైనదన్నకింక జూచెదరేల? నోటికి వచ్చినట్లు కూయుచున్నాఁడు

జయం—అంకిలాఁడి బొంకఁగా చాలదా?- జంకెదె కలకలంకమా! బొంకఁగా॥

రం-భ—అరే? ప్రేలుడుగాయా! నడునడు (గెంటును.)

జయం—ఎక్కడకురా?

మొ-భ—రాజుగారి ధర్మసత్రపు చెఱసాలకు. (లాగికొనిపోవుదురు)

భువ—పాఱిపోఁగలడు. భద్రము. మానాన్నగారితో చెప్పి వీనిని చిత్రవధ చేయించెద. (పోవును.)

(తెరవాలును.)

## తృతీయరంగము—చావడి

[చంద్రశేఖరుఁడును కళాంకుఁడును ఆసీనులై యుందురు]

చంద్ర—మంత్రివరా! సకలశాస్త్ర విశారదుఁగు మీరును నాన్నగారును కలసి చేయుకార్యములందలి తప్పొప్పులెంచుటకు నాబుద్ధి చాలకున్నను, విన్న బైరాగికి విధించిన దండన మిక్కిలి క్రూరంబని నాకు తోఁచుచున్నది.

కళా—(మందహాసముతో) యువరాజా! బాలుఁడవగుటచే నీకాదుర్మార్గునకు విధించిన శిక్ష కఠినముగా నగపడవచ్చును, కాని శాస్త్రసమ్మతమే.

చంద్ర—తప్పుచేసిన దేవతలైన నిందార్హులు, దండనార్హులు. కాని సృష్టికి నాయకమణియగు మానవవర్గంబున చేరిన ఒకని ప్రాణములను తీయుటకు రాజులకేమి అధికారమున్నది? అట్లు చంపుటవలన కలుగు లాభమేమి?

కళా—ప్రజలపై దేవసమానుఁడు రాజు శిష్టసంరక్షణంబునకు, దుష్టశిక్షణంబునకు, ఆయునకు విధి. ఇట్టి నరహంతకులు లోకసౌఖ్యనాశంబునకు హేతువులగుదురు. వారుండరాదు.

చంద్ర—మీరు చెప్పినది విశ్వసనీయమేయైనను, జీవహింసకు బదులుగా శాశ్వతకఠిన కారాగృహశిక్షవలన, నరహంతకు డెవ్వటికైన పశ్చాత్తాపము చెందు. ఇహసౌఖ్యంబులకు, పూర్తిగా చెడినను పరసౌఖ్యంబున కంతగా చెడఁడని నా యభిప్రాయము. దీనికేమి కాని అతఁడు దోషియని మీరెట్లు నిర్ధారణము చేసితిరి?

కళా—భువనసుందరీ ద్వారపాలుర సాక్ష్యమునుబట్టి దోషియని రుజువైనది.

చంద్ర—నాకు నిర్దోషియని తోఁచుచున్నది.

కళా—ఏమి? ఆమహాపాతకుడు నిర్దోషియా? నీపలుకులు వింతగానున్నవే?

గీ॥ బాలుఁడవు; నీకు లోకాను • భవము లేదు,
కాన, వానిపై వేషము • గాంచి భ్రమసి
వాఁ డమాయకుండని యభి • ప్రాయపడితి
వతివినయము ధూర్తుల చిహ్న • మనఁగవినవె?

చంద్ర—మీరు సాక్ష్యమునుబట్టికదా వానిని దండించినారు. అది సరి కాదు. సాక్ష్య మొకమూలఁ బెట్టి, మన బుద్ధిబలము నుపయోగించి సత్యాసత్యముల పరిశీలింపవలయు. మీరట్లు చేయలేదు. ఇంతియే కాక భువనసుందరి వట్టి బేల. ఆమె నెప్పుడన్నలారా చూచినవాఁ డెవ్వరును లేరు మఱి ద్వారపాలకులా పరమ నీచులు; వారిని నమ్ముటకు వీలులేదు.

కళా—కన్నులార ఆదుర్మార్గుని శయనగృహంబున చూచి పట్టుకొనినట్లు ద్వారపాలురు చెప్పుచున్నారే.

చంద్ర—ఛీ! ఆనీచుల నమ్మరాదు. నేరగాని బట్టుకొనకున్న నాన్నగారు దండింతురను భయంబున దారిం బోవుచున్నవానిం బట్టుకొని యుండవచ్చును. వారు పాపపుణ్యంబులాలోచింపక, దైవభీతిలేక తాత్కాలిక సుఖంబునకై యెట్టి ద్రోహంబునైన జంకక చేసెదరు. మఱి వారా సాక్షుల డబ్బిచ్చియో భయపెట్టియో తెచ్చిరి.

భటు—(ప్రవేశించి) మంత్రిశేఖరా! ఆ బైరాగిని శిరచ్ఛేదము చేయవలసిన కాలము సమీపించుచున్నది. దయచేయుఁడు.

చంద్ర—మంత్రిసత్తమా! నేఁడు వానిని చంపవలదు. రెండురోజులవరకు ఆగుఁడు. ఇంతలో న్యాయాన్యాయంబు నేను పరిశీలించిచెదను. ఇందుకు నాన్నగారిని నే సెలవడిగెద.

కళా—సేవకా! యువరాజాజ్ఞయైనది రెండుదినంబు లాగుఁడు.

భటు—చిత్తము (పోవును)

కళా—చంద్రశేఖరా! నీకు వానియందింత యభిమానమెందులకు?

చంద్ర—అయ్యా! ధర్మమునకై దెబ్బలాడుచున్నాడనే కాని సంభి మానముచే గాదు.

క౦॥ నరపతి తెలిసియు తెలియకొ
పౌరవా టొనరించినయెడ ♦ మోమోడక. ఆ
నెరసును జూపవలెc బతికిc
బరువడి; లేకున్న వాడు ♦ పాపాత్ముc డగుc

మఱియొకమాట భటరక్షితంబగు సంతఃపురములోని కావై రాగి యెట్లు పోcగలcడు

కళా—అదియే నా కాచ్చర్యంబుగ నున్నది.

చంద్ర—దొంగతనముగా ఎట్లోలోనికి వెళ్ళెననుకొందము. వాcడే చం పిన వాని దేహముపైగాని బట్టలపైcగాని రక్తపు డాగొకటియు కానcబడ దేమి?

కళా—చాల నేర్పుగా చంపినాcడు.

చంద్ర—అట్లేయనుకొందము. వాcడేల మాబావకు విచారింపవలె?

కళా—అదంతయు దొంగవేషము.

చంద్ర—మంచిది. నిన్నమీరు సభలో. నీవు చంపినట్లు రుజువైనది నీ వేమిచెప్పకొనెదవు?" అని వాని నడిగినపుడు వాcడేలమాట లాడcడయ్యె?

కళా—ఏమిబొంకినను లాభము లేదని యూరకుండెను.

చంద్ర—అందుచే మౌన మర్ధాంగీకారమని శిక్షించినారు. అంతేనా?

కళా—అవును.

చంద్ర—వా! ఏమిన్యాయము? ఒకపక్షమువారి సాక్ష్యమునుబట్టి దండించుట మిక్కిలి అన్యాయము.

కళా—వాcడు మాటలాడకున్న మేమేమి చేయcగలము?

చంద్ర—చతురోపాయంబులచే వానిని మాటలాడించి, వాcడేమి చెప్పనో విని, పిమ్మట తీర్పు చెప్పవలె. (లేచి) రండు: నేను

మాట్లాడి చెదను. మొదట నాన్నగారికడకు వెళ్ళిన పిమ్మట
చెఱసాలకు బోవుదము.

కళా—మంచిది. (పోవుదురు.)

(తెర వ్రాలును.)

పంచమరంగము - చెఱసాల

(జయంతుడు విచారించుచుండును)

జయం—(విచారముతో) ఔరా! విధాతా? దుర్గుణసంజాతా! ఏమి
కలుసున్నమాన్నల్లు నీవు పాటుపడి చేసినసృష్టికి చెరుపుగా
మృత్యువు నవయౌవనశోభితుల మింగివేయుచుండ. నీవు
సత్యలోకంబున పాల్సముద్రంబున నమోదకమలాసనుండవై
మర్త్యలోకంబున జరుగుచున్న చిత్రవిచిత్రంబులను గాంచుచు
వినోదించుచున్నావా! సిగ్గులేదా! నిన్నా మృత్యువెక్కడ
మింగివేయునో యను భయంబున అశక్తులగు మానవులను
దానికే బలియిచ్చుచున్నావా! పుత్రసంరక్షణార్థమై నిజప్రాణం
బుల ధారవోయుట తల్లిదండ్రులకు సహజ సద్గుణమై యుండ
నీవేమిరా ఇట్లు చేయుచున్నావు? ఓసీ! మృత్యువా! వేట
కాడమెత్తనై లేక మూడుకాళ్ళమీద బరుగెత్తునను
నట్లులా బ్రహ్మ జరాభరంబున అశక్తుడై యుండుటచే స్వేచ్ఛ
గా అచ్చువేసినట్టి నాంబోతురీతిని తిమ్మిరుచున్నావా?
కానిమ్ము. నూరుగాకులను తిన్న రాబందునకొక గాలివాన
ఎన్నటికైన రాకమానునా? హా! వయస్యసత్తమా! జయ
పాలా. నన్ను విడిచిపెట్టిపోవుట నీకు ధర్మము కాదు సుమా!

సీ॥ హా! సుగుణాలవాల! విబుధావళి సన్నుత సాధుశీల! అ
ప్పా సువిచారలోల! జయపాల! నిన్నుఁ విడనాడలేక, న
న్యాపిగమాటి నిన్ను వెనుకాడెడు నావయుఁజోపగించి, నన్ను
మోసముచేసి నేను వోరంబోలని చోటికిఁ బోయినాఁడవా?

ఎంతలో ఎంతవిపరీతము జరిగినది! చుట్టమని భార్యను జూడ
రాఁగ మృత్యువై దిగమ్రింగెనుగదా!

సీ॥ ఏల పూఁదోట కా ♦ వేళను బోతిమి?
ఆతోత్తు రావేల ♦ యప్పుడటకు?
వచ్చెబో. ఇచ్చిన ♦ బహుమతిఁ గొనిపోక,
నన్నేల రమ్మని ♦ సన్న చేసె?
చేసిన, నేనేల ♦ సిగ్గులే కేగితి?
ఏగెను నన్నేల ♦ హితుఁడు కాంచె?
కని, అది యేమన్న ♦ దని నన్నడుగ నేల?
అంత, నాతో దెబ్బ ♦ లాడనేల?

గీ॥ అతవారింటి కతఁడేల ♦ అరుగుదెంచె?
ధవుఁ జంప అజ్ఞాని ♦ తలఁపనేల?
అదియెఱింగిన నే వాని ♦ కైతినేల?
కటకటా! నొసటఁగల వ్రా ♦ ల్గడవఁదరమె?
(చంద్రశేఖరుఁడును, కళానందుఁడును ప్రవేశింతురు.)

చంద్ర—(మెల్లఁగా) అయ్యో! అతఁడు తనలో ఏమో అనుకొను
చున్నాఁడు. ఇక్కడ మనము పొంచి వానిమాటలు విందము.

జయం—సిపాయి కారణముగా జయపాలుఁడీపాడు దేశంబునకు బలియై
నాఁడుగదా! యుద్ధభూమిలో ధర్మయుద్ధంబునగిట్టినను, మత్తే
దైన జబ్బువచ్చి చచ్చిపోయిన నింత విచారముండదుకదా!
ఒడలుమఱచి నిద్రపోవుచున్నపుడొక పిఱికిపంద వాని కంఠ
ముత్తరించెనుగా! వాని సంరక్షణార్థమై నేను పోవ నన్ను
పట్టుకొని నాపైని నింద నారోపించి, రాజు నాకు మరణదండ
నము విధించినాఁడు. అక్కటా! కాలమెంత విపరీతముగా
నున్నది! ఉపకారముచేయఁబోయిన అపకారము వెంటనే
వచ్చుచున్నది.

చంద్ర—(మెల్లగ) వానిమాటలు జాగ్రత్తగ వినుచున్నారా?

కళా—(తల ఊచును.)

జయం—(నిట్టూర్పు విడిచి) ఔరా! కలికాల మహిమ!

సీ॥ ధనికుండు కల్లలాడిన నిజము దురు;
పేదవాని నుడుల వినరు సభల;
మంచిబిడ్డలు పరీక్షించు ప్రభువు లేరు;
తిన్నగా నడచిన తిండి లేదు!
మేలొనరించిన కీడు వెంటనె వచ్చు;
నిజము చెప్పినఁ గల్గు నిష్ఠురంబు;
కానివ కీజిహ్వ కెల్ల లెన్నియొ వెలగ
పాపాత్ములకు దైవ బలము మెండు;
గీ॥ దానధర్మముల్ చేయ హానంబు రాదు;
పరుల కొంపలు తీయఁగా వచ్చు చేయి
సజ్జనాళికి దైవంబు సాయుపడఁడు;
న్యాయమేయూర వెదకిన కానబడదు.

చంద్ర—(ప్రకాశముగా) అరే ఎవఁడురా అక్కడ?

సేవ—యువరాజా! నమస్కారము ఏమిఅనుజ్ఞ?

చంద్ర—ఆ నేరగాని పైకి తీసికొనిరమ్ము.

సేవ—చిత్తము (చెఱసాల తలుపుతీసి) ఔరా! పాపాత్మా! పైకి రమ్ము. యువరాజాజ్ఞయైనది.

జయం—నాప్రాణములు తీయ యువరాజా వచ్చెను? సరే. (పైకి వచ్చి నమస్కరించును.)

చంద్ర—నీ పాపపరిహారార్థము దేవుని ప్రార్థించుచున్నట్లున్నావే?

జయం—లేదు శేమ. దేవుని దూషించుచున్నాను.

చంద్ర—(నవ్వుచు) దేవుని దూషించుచున్నావా? ఎందుకు?

జయం—న్యాయాన్యాయంబులఁ బరికించు జ్ఞానము రాజుల కీయ లేదని.

కళా—ఓరీ! వలుగాకీ! మా రాజుగారిని నిందించుచున్నావా? నీ నాలుక చీల్చెద జాగ్రత్త

జయం—చావసిద్ధముగ నున్నవాఁకి సముద్రము మోఁకాలిలోతు కదా!

చంద్ర—మా నాన్నగారు నిన్న న్యాయముగా శిక్షించిరా? నాతో చెప్పుము.

జయం—చెప్పిన నేమిలాభము? కంఠశోషముతప్ప రవ్వంతయు ఫలము లేదు.

చంద్ర—నీవు నిర్దోషివైనట్లు ఋజువు చేసితివే నేను నిన్ను రక్షించెదను.

జయం—నిజమేనా? ఈమాటల నమ్మవచ్చునా?

చంద్ర—నిరభ్యంతరముగా నమ్మవచ్చును.

జయం—అట్లయిన నేను ఆపాతకిని నేఁటిరాత్రిగాని, రేపురాత్రిగాని పట్టియిచ్చెదను. యువరాజా! నాతోవచ్చెదవా?

చంద్ర—తప్పక వచ్చెదను.

జయం—మఱొకమాట. ఒంటిగా నాతో రావలయును. వెంట నెవ్వరుండరాదు.

కళా—ఓరీ! రాజద్రోహీ! ఇపుడు చేసినపాపము చాలక ఈబాలుని కూడఁ జంప నెంచుచున్నావా? యువరాజా! వీనిమాటలు వింటివా? నీవొక్కడవే రాత్రిపూట వీనివెంట బోవలెనట వెళ్ళెదవు కాఁబోలు?

చంద్ర—నేనొక్కడనే వెళ్ళెదను నాకేమిభయము?

గీ॥ వజ్రపుఁ జినుక ఎప్పుడైన ♦ బ్రద్దలగునె
మేటికొండయొక్కటి దాని ♦ మీఁదఁ బడిన?

అసమబలాశాలి యుదయించి • నట్టి నన్ను
చంపఁగలఁడె యీసింగన్న • సచివవర్య!

నీ యిష్టానుసారంబుగనే వచ్చెదను. సేవకా! వీఁని చెఱలో నుంచుము. మంత్రివర్యా! రండు. (పోవుదురు.)

(తెర వ్రాలును)



## చతుర్థాంకము

ప్రథమరంగము—భువనసుందరి మేడ.

(జయంతుఁడు చంద్రశేఖరునితోఁ బ్రవేశించును.)

చంద్ర—ఇక్కడి కెందుకు నన్నుఁ దీసికొని వచ్చినావు? ఇది మా యక్కమందిరము గదా?

జయం—అయ్యా! ఏమియు నడుగకుము. నేను చూపునదంతయు చూడుము; చెప్పినదంతయు చేయుము. రమ్ము మనమీమూల నిలఁబడి యిందు జరుగు చర్య చూతము. (ఒకమూల నిలుచుందురు)

భువ—(మేడపైనుండి నిచ్చెనమీఁదుగా రెండుమెట్లు దిగును.)

జయం—(రాజునకు వ్రేలితోఁ జూపును.)

చంద్ర—(ఆశ్చర్యముతోఁ దనలో) ఎవరది? మాయక్కమందిరములోని కెట్లు వెళ్ళినది? (ముందుకు వడివడి నడుచును )

జయం—(చేయిపట్టుకొని) ఇటురా. (లాగి) ఎక్కడకు వెళ్ళెదవు?

చంద్ర—ఆ నిచ్చెన లాగివేసిన అది క్రింద దబ్బునఁ బడును. వెంటనే దీనితో దానికంఠ మెగురవేసెద. అది భూతమేమో?

జయం—(ప్రక్కగా) మీయింటిభూతమే. (పైకి) ఇప్పుడే తెలియును. ఇక్కడనుండి కదలక చూచుచుండుము.

భువ—(క్రిందికిదిగి నలువంకలు చూచి మెల్లఁగ ముందుకునడచి నిలుచును.)

చంద్ర—(తనలో) ఈమె మాయక్క ఎక్కడకు వెళ్ళుచున్నదో!

జయం—ఎవరో తెలిసిదా?

చంద్రి—తెలిసినది మాయక్కయే. పతివియోగదుఃఖ మాపుకొనలేక నీటిలోనో నిప్పులోనో పడుటకు వెళ్ళుచున్నది.

జయం—ఆఁ! అలాగునా! అంతప్రతివ్రతయేమి!

చంద్రి—నిజము భర్తకై నిద్రాహారంబులు మాని పట్టలేని శోకంబున మునిఁగి యున్నది.

భువ—(మెల్లఁగ నడచుచు వెళ్ళిపోవును.)

జయం—అదిగో. ఈ యర్ధరాత్రంబున పతిసేవ చేయుటకే వెళ్ళుచున్నది.

చంద్రి—(కోపముతో) ఏమి కూసినావు?

కం. ఔరా! నోటికి వచ్చిన
తీరునఁ గాఱు లఱచెదు మతిచెడెనా? తులువా!
మారాడితివా చీల్చెద
వారక నీజిహ్వఁ ఈ కృపాణము చేతన్.

జయం—అయ్యో! తొందరపడి నామీఁద నేల కోపపడెదవు? కొంచెము సేపోర్చుము. యథార్థస్థితి నీకే బోధపడును. త్వరగా రమ్ము. (పోవుదురు.)

(తెరపడును.)

---

ద్వితీయరంగము - మేదరియిల్లు.

[కరటకుఁడు పచారు చేయుచుండును]

కర—(తనలో) అది ఆణ్ని సంపేసిందంటగాని, మొన్న రాత్తిరే వత్తానని యీయాలారకీ రాకనే ఉండా పోయింది. రాకపోతే పోనాది! దాని సిగ్గోయ్య. నాక తట్టుకపోయింది గంద. అది రాజుగారికి దొక్కిందంటే నాపానాలు తీసేత్తారు. ఈమలో కెల్దామంటే బయంగుంది. మా లచ్మి! నూకాలమ్మా! ఇంక కెప్పుడిలాంటిపన్లు చెయ్యను తల్లీ! బుద్దొచ్చింది. ఈగండం తప్పి

నాను పరిజల్లోపడితే నీకు మంచిగొత్తిపోతుంబలేత్తాను తల్లీ! నీకందుక్కే వాక్కరబా యేసికం యేత్తాను.

భువ—(తలుపుకొట్టును.)

కర—(భయముతో తనలో) అమ్మబాబో! నన్నాట్టుకోడానికి బంటోతులు గావాల వొచ్చారు ఏవి సేసిది?

భువ—(తలుపు గట్టిగాఁ గొట్టును.)

కర—(మెల్లఁగా నడచి తలుపుకన్నములోనుంచి చూచి తనలో) ఎవల్లో తెలకంతున్నాది. ఎవలైతే నాకేమ్భయం? ఆకత్తి నాదికాదని బూకరించేత్తాను. మరేటి? సాచ్చివేఁటి? (పైకి) ఎవల్లాళ్ళు?

భువ—నేను. తలుపు తీయుము.

కర—అమ్మనాయనా? నువ్వంటే? నంపేసిపోనావు(తలుపుతీసి)తలుపు గుద్దేటప్పటికి గుండె గుబేలుమన్నాది.

భువ—(ప్రవేశించి) నేనుండగా నీకేమిభయము?

కర—నీమీదేబారం ఏసినానుగాని యేఁవి సేసినావేటి? వద్ది సెప్పినావుకావు కబురంపినావుకావు. దా; కూకుడో (కూర్చుండును.)

భువ—ఊరంతటికి తెలియఁగా నీకే తెలియదా? చిత్రముగా నున్నదే?

[జయంత, చంద్రశేఖరులు ప్రవేశించి, ఒకమూల నిలుచుందురు]

చంద్ర—(ఆశ్చర్యముతో) ఇది మేదరికొంప. ఇక్కడకుమాయక్క రానేల?

జయం—(నాపై కిందాకఁ గోపడిచినావు) నేనవు దళ్ళేలయానవలసి వచ్చెనో యిపుడు బోధపడినదా?

కర—తెల్సిందిగాని గుండెలు లటుకూ లటుకూమంటున్నాయే. ఏఁవి శేశావు సెప్పే? [పైఁ జేయి వేయును.]

చంద్రి—(కోపముతో) ఔరా! కామాంధా! ఏమి నీపొగరు?
(ముందుకు బోవును.)

జయం—(అడ్డుకొని) నిలు. ఎక్కడకు వెళ్ళెదవు?

చంద్రి—ఆయుధమాధముని హస్తమును తుత్తునియలు చేసెదను. వాఁడేడ? ఆమెయేడ? నాట్లుకొనుటేడ? (ముందుకు నడచును.)

జయం—(పట్టుకొని) తొందరపడక జరుగునదంతయుఁ జూడుము.

చంద్రి—ఇంకను జూచునది యేమి? నన్ను విడువుము

జయం—నేనువిడువను. నామాటవిని తిన్నఁగా జరుగునదంతయుఁ జూడుము.

భువ—మొన్నరాత్రి యిక్కడనుండి యింటికి వెళ్ళి మెల్లఁగా గదిలోకి బోయినాను. అక్కడనాముగఁడు గాఢనిద్రలోనున్నాడు

జయం—వినుచున్నావా! తొందరపడక జాగ్రత్తగా వినుము.

భువ—అంత నీవిచ్చిన కత్తితో నొక దెబ్బకు వానిని మాతాతను జూడఁబంపినాను. కాని—

చంద్రి—(పండ్లు కొఱుకుచు) ఓసీ! ముందుకు నడచును.

జయం—(చంద్రశేఖరుని నోరుమూసి పట్టుకొని) ఊఁ. ఆగు.

కర—కాని అని వూరుకున్నావేఁవి? చెప్పు పిల్లా!

చంద్రి—ఓసీ! క్షీరనిభ పత్కులకళంకినీ! జారిణీ! (ముందుకు దుముకును)

జయం—(పట్టుకొని కోపముతో) నిలు ఎంత చెప్పినను వినవేమి?

చంద్రి—ఆపాతకిపలుకులు నాచెవుల కలుగులై యింత పెట్టుచుండ నే నెట్లూరకుండఁగలను? విడు (విడిపించుకొనఁబోవును)

జయం—నేను విడువను.

చంద్రి—విడువుము.

జయం—విడువను

చంద్రి—నామాట విను.

జయం—నామాట విను.

చంద్ర—ఛీ!

జయం—ఛా! నేనుపడినకష్టము వ్యర్థము చేసెదవా? జాగ్రత్త ఇక్కడ ఇప్పుడు నీయిష్టము పనికిరాదు.

చంద్ర—నీ బుడిబుడి పలుకులకు జడియుటకీ చంద్రశేఖరుఁడు గాజులు తొడిగించుకొనలేదు. వదలుము.

జయం—నేను వదలను ముందడుగిడితివా మనపని చెడును ఓర్చి యుండి వినవలసిన దంతయు వినుము.

చంద్ర—ఈదుర్ణయంబును జూచుచు అశక్తునివలె ఒకమూలఁబడి యుండమందువా? క్షత్రియధర్మమేనా?

జయం—ఇప్పు డట్లు చేయక తప్పదు.

చంద్ర—అయిన నాకీకత్తి యెందుకు? (కత్తినుద్దేశించి)

చ॥ అనుపమ ధైర్యసాహస బలాదులఁ గీర్తినిగన్న రాట్శిఖా
మణుల కరంబున న్నిలిచి మన్ననలందెదు శస్త్రరాజమా!
ఘనతర పాపకర్ములను గ్రక్కునఁద్రుంపని నన్నుఁబోలు భీ
రునికడనున్న నీయశము రూపఱు;కావున, లేచిపోఁగదే!

(కత్తి నేల బాఱవేయును.)

భువ—ఒక బైరాగి నాపడకటింటిలోనికి వచ్చినాఁడు. ఏలాగున వచ్చినాడో తెలియదు.

కర—(ఆత్రముతో) ఏటీ! బైరాగోడొచ్చాడా? నువ్వాణ్ణి సంపీసం సూచాడా? సెప్పే.

భువ—ఆఁ. చూచినాఁడు.

కర—(గుండెలుకొట్టుకొనుచు) అమ్మబాబూ! నాకొంప నాగే పోనావే. ఆణ్ణికూడ సంపేసేపోనావా?

భువ—నేనెందుకు చంపవలె? మా నాన్నగారితో చెప్పిచంపించినాను.

కర—మీబాబుకో యేటి సెపినావ్?

భవ—ఆబైరాగియే నామగనిని చంపినాఁడని చెప్పితిని. మానాన్నఁ గారు నామాటలు నమ్మివానికి మరణదండనము విధించినాఁగు ఈవేళ భటులు వానిని చంపివేసినారు.

కర—(సంతోషముతో వెన్నుతట్టుచు) బేస్. బేస్. మంచిగమ్మానూ సేశా వే. ఇంక మనకేం బయం సేదు.

చంద్ర—అరే. కామాంధా! ఏమిరానిపొగరు? (వెళ్ళి మేదరివీపు పై దన్నును)

కర—అఁ. ఎవ్వడాడు? (లేచును)

భవ—(తుళ్ళిపడిలేచి మూలడాగుకొనును)

కర—(చూచి పఱిపోఁబోవును.)

జయం—(పట్టుకొని) ఎక్కడకుపోయెదరా? నిలు. (కాలితోఁ ద్రొ ముందుకు త్రోయును)

చంద్ర—(గట్టిగా సీలవేయును.)

భటులు—(ప్రవేశించి) యువరాజా! ఏమనజ్ఞ?

చంద్ర—వీనిని బట్టుకొనుఁడు. ఒక స్త్రీకూడ నిదుంకును; వెదకుఁడు.

మొ-భ—అఁడుది ఎవతెయో యున్నఁదట! ఏదిరా చెప్పు.(అన్నను)

కర—అడదా? ఎక్కడిదీ? నేదే నానొక్కణ్నే ఉన్నానుడున్నాను.

రెం-భ—కల్లలాడెదవా? నిజము చెప్పుము (అన్నను)

కర—సోపతోటు. నా కెఁకినేదు బాబూ!

రెం-భ—ఇంక నదియేమాటా? గట్టిగాఁ దగిలినగాని చెప్పవే (అన్నను.)

కర—సెప్తా. సెప్తా. అల్లామూలనది

భటులు—(వెళ్ళి) మూలనూరునావా? పైకిరా. (చేయిపట్టుకొని పైకి లాగి చూచి, విడిచి, ఆశ్చర్యముతో) ఈమె మారాజు కూతురు. ఇక్కడకేలాగున వచ్చినది?

చంద్ర—భటులారా! వీరిద్దఱును గొనిపోయి చెరనుంచుడు. అయ్యో! రండు; పోదము. (పోఁబోవును.)

భువ—తమ్ముడా! చంద్రశేఖరా! నా మానము తీసెదవా?

చంద్ర—ఒసీ కులటా! నీవెక్కడి యక్కవు? నేనెక్కడితమ్ముఁడను? ఆనంబంధము నేఁటితో సరి. యౌవనమదంబున కన్నుగానక నీమానము నీవే తీసికొనినావు (పోవును)

జయం—(చంద్రశేఖరుని వెంట బోవును.)

భటులు—(కంటకుని భువనసుందరిని తీసికొని పోవుదురు.)

(తెర వాలును)

---

తృతీయరంగము—రాజసభ

[సుదర్శనరాజు, కళానందుఁడు, చంద్రశేఖరుడు, కరటకుఁడు, భటులు నుందురు]

సుద—మంత్రివరా! ఏమిసమాచారములు? చిరంజీవి వెళ్ళినకార్య మేమాయెనఁ?

కళా—దేవా! చిరంజీవి బాలుఁడయ్యు, కుశాగ్రబుద్ధి గలవాఁడగుటచే కష్టపడి జయపాలుని జంపిన పాపిని పట్టుకొనినాఁడు.

సుద—ఏమీ? జయపాలుని జంపిన దుర్మార్గుఁడాకపటతాపసికాఁడా?

కళా—కాఁడు. కాఁడు. పొరబడి మనము శిక్షించినారము కాని యతఁడు నిర్దోషియని తెలియవచ్చుచున్నది

సుద—అలాగునా? నా ముద్దులయల్లుని జంపి నన్ను దుఃఖమున ముంచిన తెంపరి యేఁడీ?

. (భువనసుందరియు, నగనాదియు, భటులును ప్రవేశింతురు)

సుద—అమ్మా! నీవేల సభకు వచ్చినావు?

కళా—దేవా? ఈమెయే యాతనిఁ జంపినదని యువరాజు అభిప్రాయము.

సుద--(ఆశ్చర్యముతో) ఆఁ! ఏమీ? నాముద్దుకూఁతురు నాయల్లుని జంపినదా? ఛా! ఇవి యేటిమాటలు?

గీ॥ ధవుని రాకకై మిగుల నా • తురింబుతోడ
దిన మెదురుచూచుచుండు నా • యనుగు కూఁతు
రిట్టి ఘోరకృత్యము చేయ • నట్టులొనునె!
నమ్ముటకు వీలులేదు; నే • నమ్మ జాల

చంద్ర—నాన్నగారూ! తామిప్పుడు న్యాయాన్యాయంబులు పరీ
క్షింప సింహాసనంబున నధివసించి యున్నారుగాని బంధు
త్వము చూపుటకుకాదు. కనుక నేను చెప్పనదంతయు సావ
ధానంబుగ కోపము మాని విని పిమ్మట మీ చిత్తానుసారంబున
చేయ బ్రార్థించెద.

సుద—మంచిది. నీవేమి చెప్పెదవో చెప్పుము.

చంద్ర—చిత్తము. ముఖచిహ్నముఁబట్టి యాబైరాగి నిరపరాధి
యని నాకుఁ దోఁచుటచే రెండు దినంబులవఱకు వానికి
విధించిన మరణదండన మాపుఁడని మిమ్ము నేను వేఁడితిని
గదా. తర్వాత నేనును మంత్రిగారును గూడి వాని చెంతకుఁ
బోయి మంచిమాటల నడుగఁగా జయపాలుని జంపిన ఘాతకుని
జూపెదనని చెప్పినాఁడు. అందుకు నేసమ్మతించి నిన్నటిరాత్రి
వానితోఁ గలసి యీమె మేడకడకు వెళ్ళితిని అంతఁ గొంత
సేపటికీమె నిచ్చెనమీఁదినుండి మేడ దిగినది.

సుద—రాత్రిపూఁట దొంగతనంబుగ నీమె మేడదిగుట కేమిపని
యున్నది? సరిగాఁ జూచితివా? ఈమెయేనా?

చంద్ర—స్పష్టముగాఁ జూచినాఁడ ఈమెనే. పిమ్మట నీయధముని
యింటఁజొఱినది. కనఁబడకుండ మేమీమెవెంటనే వెళ్ళితిమి.

సుద—(ఆశ్చర్యముతో) ఈమే వీనియింటికా వెళ్ళినది! (కూఁతురు
నుద్దేశించి)

గీ॥ రాణివాసంబు నందుండు • రాచబిడ్డ!
వరుస గోల్పోయి నట్టి నీ • ర్భాగ్యురాలు

ఆడ్డకేము మేకరియింటి • కరుగ నేల?
పసువు దీసితెచ్చిన వా • పాత్ముగాడా!

చంద్ర—సుకని నెట్లులచంపినదో యీదుర్మార్గునితోఁ జెప్పుచుండుట నేను చెవులార వినినాఁడ. ఈకత్తె యాసన్యాసికి దేయులచే బావను గాచనెంచి నాటిరాత్రి దీగనెంబు వెళ్ళినాఁడు కాని వెనుకగుటచే నట్లు చేయకపోయె అంతఁదనగుట్టు బ్రడ యగునను బయటబెట్టునోయను భయమువున విదియానేరంబును వానిపైమోపినది. ఇది నాకుఁ దెలిసినది.

సున—ఓరీ! అధమాధమా! ఇపుడుచిరంజీవి చెప్పినదంతయునిజమేనా?

కర—కాప్రభో! అన్నివచ్చబడ్డాయి, నాకేమీతెల్దు, నేనొట్టి గ్గోసిని. ఆబంటోతులుకిట్టలూరికే యిచ్చామకానని నన్నెట్టుకున్నారు తరోత మీాసిత్తం; నాభాగ్యం.

చంద్ర—కన్నులారాజూచిపట్టికొనిన నాచెంతనే బొంకెదవా? ఈ కత్తి యెవరిది? (ఇచ్చును.)

కర—(పుచ్చుకొని చూచి) నాదానాచే వుందిగాని నాది గాదు, అదెవరిళ్ళదో? (ఇచ్చివేయును.)

చంద్ర—నిజము చెప్పితివా నీకు శిక్షతగ్గును; లేనియెడలఁ జచ్చెదవు ఆలోచించుకొనుము.

కర—(తనలో) మంచునా గుండే వున్నాడు కాని యెంతపనిచేసినాడు నాకొంప తీసేసినాడు.

చంద్ర—మాటాడవేమిరా?

కర—చిరంజీవిబాబో! మరబద్ద మెందుకాడాలి? ఇన్నాళ్ళకిపాపంపండింది. ఆకత్తినాదే; నానే యిచ్చాను

చంద్ర—వినుచున్నారా? అదినీయింటికెనానాళ్ళనుంకివచ్చుచున్నది

కర—శానాళ్ళబట్టివొత్తున్నాది. మాయింటికి రావొద్దు పోయే అంటే పోయేదికాదు. భూతంనాగొద్చి మాయింటిమీాఁద పడేవి.

బాబూ! వచ్చినతరోత పాప్మం బాగుండదని తలుపు తీసి వాణ్ని.

చంద్ర—మీరాయిద్దఱును రాజ్యభారములు వహించుచుండ దుర్మతి యెవరు?

కర—ఈ దాసీనంజేబాబూ! ఎన్నైనగలెట్టుకుంటో నూకుబాబూ. ఇలాంటివన్ని నేనేగడించింది.

సుద—ఓసీ! దాసీముండా దీనికంతకు నీవా కారణము? (నలుకబోవును)

చంద్ర—(అడ్డుకొని) శాంతింపుఁడు ఏమే, నీవు చెప్పినది నిజమేనా?

సంగ—చెప్పినట్లుచేయకున్న ఈయమ్మ కేమికోపము వచ్చునోయని చేసితిని, క్షమింపుఁడు.

చంద్ర—నాన్నగారూ! దాస దాసీజనంబుల ప్రవర్తనమునూహించి విచారింపక యుండ చేరనిచ్చుటవలన సత్కుటుంబము లనేకము లిట్లన కీర్తి పాలగుచున్నవి.

సుద—తక్కిన బానిసముండలకు బుద్ధివచ్చునట్లు దీనిముక్కు చెవులు కోసి యూరెల్ల వారము రోజులు త్రిప్పుఁడు ఓసీ సత్కుల కంటకమా! నాటివారిలో నన్ను చిన్నపుచ్చితివి కదే దుర్మతీ!

క॥ మేకులు మేనఁ గొట్టిన,
భీకరమృగపాళి వాతఁ బెట్టిన నిన్నుఁ,
నాకసి తీఱదు తీఱునె?
నాకడుపు చెఱుప జనించి నావఁటె? చెనఁటీ!

భువ—దీనికంతకుఁ గారకులు తామే.

[ఒక భటుఁడు జయంతుని దీసికొనివచ్చును.]

సుద—[పండ్లు కొఱుకుచు] ఓసీ! కుంభా! ఏమి పిలుచున్నావు? నీవు నేనా మేదరిమగనిఁ గట్టిపెట్టితినా?

వ—ఇంతదాఁక నన్నత్త వారింటికి పంపకుంట మీరే చేసిరి.

సుక— కమాచి — రూపకము

చీ! చీ! చాండాలిని! నా - చెంతనుండి లేచిపో;
చీ! చీ! మాటుచెప్పెదో? - సిగ్గులేక యింత జాణవో॥ చీ॥
జారగుణము చెల్లునే - సంసారి నారి కిట్లు?
క్షీరవార్ధిం బోలుకులము - చెఱిచినావు దుర్మతీ॥ చీ॥
ఏమి లోటివాని మరగి - యింటిమగని చంపెదో!
కాని నీ! నిన్ను జీవముతో - కాల్చివేయ కోపమాయెదే॥ చీ॥

నాయనా! చిరంజీవీ! నీ చిత్తానుసారంబుగా ఈ ద్రోహుల దండింపుము. దీని మొగము నేను చూడలేదు (పోవును)

చంద్ర—చిత్తము. మంత్రిసత్తమా! భువనసుందరికి శాశ్వత కఠిన కారాగృహశిక్షయు, మేదరివానికి పదేండ్లు కఠినశిక్షయు విధించితి. సన్యాసినిరపరాధి కావున వెంటనే విడిచివేయునది ఆర్యా! ఋషివర్యా! మిమ్మన్యాయంబుగా శిక్షించినందులకు మన్నింప ప్రార్థించెద. పొరపడుట మనుజనైజము. కష్టములకు ఘాతకులను పట్టియిచ్చినందుకు మీకనేక వందనములు. మఱి మీకేదేని కోరికయున్న తెలుపుడు.

జయం—యువరాజా! నేను కాశికి పోవుచున్నాను. కాన జయపాలుని అస్థుల నాకొసంగెదవేని వానినిగొనిపోయి గంగలో కలపెదను.

చంద్ర—చిత్తము. అలాగుననే యిచ్చెద. మంత్రివరా! ఆద్రోహుల భద్రముగ చెఱం బెట్టింపుడు.

కళా—అటులే చేసెద. భటులారా! వానిని తీసికొనిపొండు (పోవును.)

భటులు—(భువనసుందరిని మేదరివానిని తీసికొని పోవుదురు)

జయం—అయ్యా! రండు. (పోవుదురు)

(తెరవాలును.)

## తురీయరంగము - సౌధోపరిభాగము

(జయంతుడు దుమ్ముల మూటను పట్టుకొని ప్రవేశించును.)

జయం— (సంతోషముతో తనలో) అహో! చంద్రశేఖరుండు నిజముగా ధర్మావతారమని చెప్పనొప్పు. ఏమి వానిబుద్ధికుశలత! ధైర్యము! సాహసము! భువనసుందరివంటి కుమార్తెలు నూఱుగురు పుట్టుటకంటె చంద్రశేఖరునిఁ బోలు బాలుఁ డొకఁడు చాలఁడా వంశ ముద్ధరించుటకు? అతఁ డడ్డుపడి నాప్రాణములు రక్షించినాఁడు ..చా! ఏదు వచ్చిన నంతోషము? ప్రాణసఖుడు పోయినాఁడు గదా. వాని వెంబడి వచ్చియు, సర్వమెఱింగియు, వానిని గాపాడలేకపోతినిగదా! ఈ దుమ్ముల సకలకలుషవిభంగ - అభంగ-గంగాతరంగిణిలో చేర్చి వాని ఋణము తీర్చుకొనెద. వారణాశికి పోయెద. పొట్టకై వీరిని వారిని ఆశ్రయింపనేల?

ఉ॥ ఎందఱో రాజు లీజగతి నేలిరి; ఎందఱో పోయినార, లిం
కెందఱో వచ్చువారు; కలఁడే స్థిరుఁ డా నృపుఁ డొక్కఁడేనియుం
ఎందును కష్టనష్టములె; ఇట్టి యనిత్యపుసేవ కాల్పనా?
పొందుగ నచ్యుతుం గొలిచి పొందెద నవ్యయ సౌఖ్యసంపదల్.

నా మంత్రిపదవి జయపాలునితోడనే పోయినది. మఱొక రాజుకడ మంత్రిపదము స్వీకరించి వానిని కొలుచుట యీజన్మమున నుండదు. ఇఁక నన్యదేశంబునకుఁ బోయి యేదేని స్వల్పోద్యోగంబునకు ప్రయత్నింపవలె నందుకొక గొప్ప యుద్యోగిని ఆశ్రయించి అట్టముకుగట్లు కలుపవలె. మఱి వాఁడు నీచుఁడైన,

సీ॥ దేవదేవ! మహాను ♦ భావ! నీ సాటివా
రీభువిని లేరని వానిఁ ♦ బొగడవలయు;
కొట్టినఁ దన్నినఁ ♦ తిట్టినఁ గెంటినఁ
తలవంచి పడియుండ ♦ వలయు నెప్డు;

దినము బాజాలుకుఁ ♦ జని కూరఁ దేవత
  కాని యిచ్చిన, అణా ♦ కాని పెట్టి;
ఏడ్చెడు పిల్లల ♦ నెత్తుకొనవలయు;
  దిన మింటి చుట్టును ♦ తిరుగవలయు;
బాబుగారికయా సం ♦ పాదింప దిన మమ్మ
  గారిని సేవించి ♦ తీరవలయు;
గీ॥ నడుమ నడుమ లంచంబులం ♦ గట్టవలయు;
జ్ఞానమును చూరాది పనులిచ్చు ♦ కాలమేగె;
అకట! గొప్పయింటను పుట్టి ♦ నట్టి నేను
చేయఁజాలని పనుల; నేఁ ♦ జేయఁబోను.

ఒకవేళ సిగ్గువిడిచి అనీచకార్యంబులఁ జేసినను, దానఁగలుగు ఫలము స్థిరము కాదుగదా! కష్టార్జితమునను గడుపునింపవలె అదియునుగాక ప్రతిరోజు చెమటలు కాలునట్లు కష్టపడి ధన మెంత తెచ్చి యెంతగారాబముగా ఈ శరీరమును పెంచినను తుదకు భూమిపాలే కదా.

చ॥ తనువొక గాలిబుట్ట; ఒగి దానికి దిక్కుల నన్ని చెక్కినన్,
కనకపుఁ బూత పూసినను, కష్టమెకాని ఫలంబు లేదుగా;
చనగని ప్రాణవాయువులు చప్పునఁగూలెను; అంతదానినిన్
గనుఁగొనరాఁడెవండు; కొంతగాదది అప్పడు గ్రుడ్డిగవ్వకేన్
కాన నస్థిరంబగు నీ దుమ్ముల పంజరంబునకై బ్రతికెడు నాల్గురోజు లేల వ్యర్థము చేయవలె? ఈ చెంతనే యున్న మాయత్తవారి యూరికిఁబోయి నాభార్య యెట్టిగుణవంతురాలో తెలిసికొని పిదప గాళీశ్వరుని పదసేవ చేయఁబోయెద. (పోవును.)

(తెర వ్రాలును)

పరిచము రంగము—భామిని మందిరము.

(జయంతుఁడు కూర్చుండి యుండును.)

జయం—(తనలో) ప్రొద్దుట జరిగిన సంభాషణమునుబట్టి యీయిల్లు

నా యత్తవారిదని విశదంబైనది. ఆవృద్ధదంపతులు నాయత్త మామలు. ఆపదునారేండ్లపసిబొమ్మ నాముద్దుగుమ్మ. ఆమె నయము, లజ్జ, మాటలు చూడ గుణవంతురాలని తోచుచు చున్నది. స్త్రీస్వభావ మామె కన్నులఁబట్టి చక్కఁగా గ్రహింపవచ్చును. కాని కొందఱు సుందరుల డెందంబులు నారికేళ పాకంబులు. సులువుగాఁ గొఱుకఁబడవు. కనుకఁ బూర్తిగాఁ దఱిచి చూచినఁగాని నాయనుమానము పోదు. అదిగో! వచ్చుచున్నది.

శ్రీరాగము - రూపకము.

శంకరా! రిపు హరా! - సజ్జన క్షేమంకరా!
శాంకరీ ప్రియకరా! - సర్పరాడ్భూషణా! ॥ శంక॥
బాలసుధాకర ధరా! - ఫాల నేత్రకరా.
శూలభాసితకరా! - నీలగళ! పాపహర! శంక॥

(భానుమతి ఫలపుష్పంబులఁ బట్టుకొని ప్రవేశించును)

భాను—మహాత్మా! నమస్కారము, ఈఫలపుష్పంబు స్వీకరింపుడు.
జయ—శీఘ్రమే భర్తృప్రేమాస్పద వగుదువుగాక! (పుచ్చుకొని)
నారీమణీ! కూర్చుండుము.
ధీర! గంగాధరా! - మేరుభూధరధరా!
సూరసన్నుతవరా! - మార గర్వాపహర! ॥ శంక॥

(పూజచేసిపువ్వులుకొన్ని తీసి) ఈపుష్పంబుల గైకొనుము (ఇచ్చును.)
భాను—(పుచ్చుకొని కన్నుల నద్దుకొనును.)
జయం—నందియ మెందులకు? తప్పులేదు. సిగలోఁ దుఱుము
కొనుము:

కం॥ బలితపుసిగలో పూలున్
లలితంబగు నాసికంబు ♦ వర ముంగరయున్,
చెలువగు కన్నులఁ గాటుక,
కలచో అందంబు హెచ్చు ♦ కాంతామణిరో!

భాను—(విచారముతో) నా కందమెందుకు? చందమెందుకు? ఎవరు చూచి యానందింపవలె?

జయ—ఏ లట్లనుచున్నావు? మొన్న మొన్న కన్నువిచ్చిన నీవింతవిరక్తిమార్గంబునఁ బడనేల?

భాను—మహానుభావా! మీకుఁ దెలియని దేముండును? పతివిసర్జిత కాంత జీవచ్ఛవంబుగదా. శవమునకు సింగారమేల?

జయం—ఆఁ! సద్గుణఖనివగు నిన్ను నీభర్త విడిచిపెట్టినాఁడా? పాపము! ఎంతపని జరిగినది? కారణమేమైయుండును?

భాను—కారణ మిదియని నాకుగాని నా తల్లితండ్రులకుఁగాని నేఁటివఱకు దెలియదు.

జయం—అలాగునా? వెఱ్ఱివాఁడు; వాఁడే వచ్చునులే తప్పలేదు; పూల నలంకరించుకొనుము.

భాను—మహాత్మా!

చ. కురులను దువ్వఁగాచనదు? కూర్పరగ రామ శిగన్సుమంబు; లా
భరణము లుంపరాదు; నెఱివస్త్రము కాటుకయొప్పు మట్టఁగా
పరివడ; దింకపీడియము సాఁతరాన్నము నంటరాదు? స్త్రీ
వరు నెడబాసియున్నతఱి; ప్రాజ్ఞులు మీకిది క్రొత్త ధర్మమా?

జయం—(తనలో) అబ్బా! పిట్ట చిన్నదైనను, కూఁత ఘనముగనున్నదే! నేనీ శ్రీరంగనీతులు విని మోనపోవు వాఁడనుగాను. (పైకి) నిజమేకాని పసిపిల్లవగు నీ విప్పటినుండి పైనిర్బంధనలఁ దెచ్చిపెట్టుకొని కష్టపడనేల? ఔరా! దుర్మార్గుడా! ఎంత పొరపాటు చేసితివిరా?

భాను—మునివర్యా! ఆనన్మార్గునితోఁ గలసి సుఖింపఁ నోచుకొనని యీదౌర్భాగ్యురాలిని సందింపఁదగునా? కాని యాయన నెందుకు నిందించెదరు? నేనుగాకున్న నన్నుఁ దలఁదన్ను కన్నెమిన్న వేలాఁతె వారిసేవ చేయును.

జయం—వెఱ్ఱిదానా! నిరుపమ సౌందర్యరాశివగు నిన్ను మంచిచేసి కొని సుఖింపక సిరి రానున్న మోఁకాలొడ్డు మూర్ఖుఁ వలె నిన్నుఁ ద్యజించిన నీమగండు నిర్భాగ్యుండు; కాని నీవు కావున వాని పదసేవచేయ నిన్నుమించుసుందరులువచ్చుటకల్ల; కాని జగన్మోహినివగు నీ యిష్టపడిన, రాజాధిరాజులు దాసులై ని కన్నుసన్నల సంచరింపెదరు.

భాను—ఋషిరాజా కడుపుఁజిచ్చు నార్పుకొనఁ దిరుగుచున్న కోడి, అమూల్య నవరత్నాభరణంబుల కంటె నొక కందిగింజను గొప్పగాఁ జూచునట్లు, మనోహరుని పదసేవ చేయఁ గోరు చున్న కలంతి, వాని కాలి గోటియొకనంను గౌరవం బఖండమండలాధిపతుల యెడ నుంపదసు మీరెఱుఁగరా?

జయం—(తనలో) ఈకలి పలుకులు నా సందేహాంధకారంబును నిర్మూలము చేయుచున్నవి. మాటల కనుగుణ్యంబుగా మదియు, పనులు నున్న నాభాగ్య మునగణ్యంబుకదా! రూప వతియు గుణవతియు నగు కులకాంతను బాసి సన్యసించుటకు నేను పిచ్చివాఁడనా?

సీ॥ చక్రికిఁ గల దొక ♦ చక్రమేకాని, ఈ
కాంతకు రెండు చ ♦ క్రాలు గలవు;
శ్రీపతి కట్టెను ♦ చేలమే కనక మీ
భామిని మేనెల్ల ♦ పసిఁడి ముద్ద;
శంభుండు తలనర్ధ ♦ చంద్రునిఁ దాల్చిన
నిండుచంద్రుఁడీమె ♦ యడుఁగులఁదు;
కంఠమందు విషంబు ♦ కలదు శంకరున క్కీ
దానకంఠమ్మునసుధా ♦ సంకులంబు;
గీ॥ కనుక, ఈమెకు నన్నిట ♦ వెనుక వచ్చు
వారి నాశ్రయింపుటచేత ♦ ఫలం లేదు;

నా నేర మది యేమి?- నాతోడఁ జెప్ప రాదా?॥ ప్రా॥
ననుఁగూడ మీ వెనుకఁ- గొనిపో రాదె; నాథా!
చనునే కలసి నీ- సరణి నొల్లకుంటకు?॥ పా॥
ఎన్నఁడు దయ వచ్చునో - ఎప్పుడు వత్తువో యని,
ఎన్నుచుండ కోటితో-పున్నయమ్మ నాయాశ॥ పా॥

జయం—కోమ్మా! విచారింపకుము. ముందు నాకు వాఁడెక్కడనైన కనఁబడిన పట్టి తీసికొనివచ్చి తప్పకుండ నీ కప్పఁజెప్పెదను. లోనికి పోదము రమ్ము (పోవుదురు)

(తెర పడును)

---

ప్రవరంగము—చావడి.

[జయంతుఁడు పచారుచేయుచు నాలోచించుచుండును]

జయం—(తనలో) అక్కాంతమణి పైచేష్టలవలనఁ బరమ పతివ్రతవలె నగపడుచున్నది. కాని యంతరంగ మెట్టిదో తెలియకున్నది. తన మనసునకు మగఁడు నచ్చకున్నను, దరిద్రదశలోనున్నను, తల్లి జారిణియైనను; జారిణుల సహవాసమబ్బినను, భర్త యుపేక్షించినను, దేశాంతరగతుఁడైనను, తాను చాలకాలము పతిసేవ చేయకున్నను, ఇంటికిఁ దానే పెద్దయైనను, బాల వితంతువైనను సాధారణముగ పద్మినీజాతి గాక్రైనను వ్యభిచారగుణ మబ్బు. అట్టిదాని నొక చిటికెలో పోల్చుకొన వచ్చును.

చ॥ పగలు వయారి పన్నకలు పండ్లిగిలింపులు, మాటనేర్పులున్
ఎందిగ నన్యపురుషుల నెప్పుడు చూచుట, కోరచూపులున్
మగని నలక్ష్యపెట్టు, టను మానము లజ్జ భయంబు వీడుటల్.
తెరువము, పల్లవంబు చెలుతించియు జారిణి కాండ్ల గుణ్

కాని యిట్టి దుర్లక్షణంబులం దొక్కటియు నక్కలికిఁ గడఁగానఁబడకున్నది. ఇంతకు, ఈపరీక్ష చాలదు. ఇంక రెండుమూడు

రోజులుండి, దాని నడతను కనిపెట్టవలయు. రాత్రిందివ రాకుండు టకు పగలు బాగుగా నిద్రపోతిని. ఏగోడమేడల దాటి భవనసుంద రవలె ఏవిటకాని యింటికేగునో కనిపెట్టవలయు. ఈయింటిచుట్టు నేఁటిరాత్రియంతయుఁ దిరుగుచుండెద. (తిరుగుచు పిట నభి నయించి) ఆఁ! నాయనుమానము నిజమగునట్లున్నది. మెల్లఁగ నెవ్వరో తలుపు దీసినట్లు చప్పుడైనది (పోవును)

భాను—(మెల్లగవచ్చి తనలో విచారముతో) ఈరోజువఱకు నా భర్త నేఁడేవచ్చునో రేపేవచ్చునో యని నాశతో నెదురు చూచుచుంటిని గాని నాయుంగన మాఱుపి నాప్రియుఁడు దేశభ్రష్టుఁడైనాఁడని చెప్పఁగానె నిరాశఁ జెందితి. ఇన్నియేండ్లనుండి రాని మగఁడిఁక వచ్చునా? పట్టిది వెఱక కాళికా దేవిని సేవించిన నాకోరికతీరునని ఆయోగిని చెప్పుటచే ఇంత దాఁక ఎట్లో ప్రాణంబులు నిల్పితి. కాని యింక నొకగడియ యైన మనఁజాల. విచారభారమున నలిగి పోవుచున్నాను. ఎండైన బడి ప్రాణంబులు విడిచెదను.

జయం—(తొంగిచూచి తనలో) అదిగో! అక్కడ నిలఁబడి యేమో ఆలోచించుచున్నది.

భాను—(తనలో) ఆతాపసి యెక్కడ? (నలువైపుల చూచి) మునుల స్థిరచిత్తులు. వారి కాళ్ళొకచోట నిలువవు. ఎక్కడకో పోయినట్లున్నది. పోనిమ్ము. ఎవండిదే నాపని కెక్కడ అడ్డు పడునో యని భయపడితిని. జాగేల? పోయెద. (పోవును)

జయం—ఊఁ! నీప్రాణములఁ దీయుటకే నేనిక్కడ ఉంటిని. ఓరా! దానిపై మెఱుంగులఁ గనికేను మాసగాతిని కాబోలు!... ఇంతకు ఎట్లు నిర్ధారణము చేయుటకు వీలు కున్నది. కానిమ్ము; ఇప్పు డంతయు తెలియఁగలను (వెనుకగా పోవును.)

(తెరవ్రాలును)

---



# పంచమాంకము

ప్రథమరంగము — కాళికాలయము.

(భానుమతి ప్రవేశించును)

భాను— ఓచండికా! త్రిలోకారాధ్యుండగు గంగాధరుని అర్ధాంగివనియు మహిషాసురానేకలోకభయంకరరాత్రించరాధములఁ జక్కడించి సాధుసంతతికి మహోపకారంబు గావించితి వనియు భక్తజనుల పాలిటఁ జింతామణివనియు, నిను పేరాశతో నిన్నాశ్రయించినందుకు చాల సాయము చేసి గావు నావంటి బుద్ధిహీను లెంకలు నిన్నాశ్రయించి నిరాశచే ఉసురులు గోల్పోయిరో కదా! ఇంటిపేరు కస్తూరివారు ఇల్లెల్ల గబ్బిలంబులవాసనయను నార్యోక్తి నీయందు వ్యక్తమగుచున్నది. అమాయకుల బెదరించి పొట్టపోసికొను నీవెక్కడ? దాసులను కాపాడుటెక్కడ?

గీ॥ గ్రామముల మీఁద జెలరేగి ♦ కరుణమాలి

యెనుములను గోళ్ళ గొఱ్ఱెల ♦ జనులఁ బట్టి

కడుపునిండ మెక్కఁగ శక్తి ♦ గలదు కాని

శ్రితులఁ రక్షింప నీ కింత ♦ చేత కాదో!

జయం—(ప్రవేశించి తనలో) ఔరా! ఏమి! దీని తెగువ! ఈ నిర్జనముగ నున్న ఈ దేవాలయంబున కర్ధరాత్రంబున నొంటిగ వచ్చి, విటకాని రాకకై యెదురు చూచుచున్నది ఈజగజ్జననీ ఖలసంహారిణి కన్నులముందు వ్యభిచరించు స్త్రీ యెంత సాహసి గాక యుండవలె! కామాతురులకీజగము తృణప్రాయము ఈ కోడెగాఁ డెంత యందగాఁడో చూడవలె. (కత్తినుద్దేశించి)

చ ఖల గజపుంగవాళిని జికా కొనసాగించి వధించి, రక్తధా
రలు మును దాహించి వర్ధిలిన రాజిక శస్త్రము! చిక్కిపోతివి
ప్పుడు పలునాళ్ళనుండి తగుభోజనమేమియు లేక; కావున
బలసిన మర్త్యులిద్దఱను బట్టి యొసంగెద; మేలుకోగదే.

భాను—ఓ త్రిపురాసుర సంహారిణీ! నీకు దాసుఁ గాపాడు శక్తికల
దని, నియమము దేవతాత్వముండనేని, నామొఱ్ఱ వింటివేని,
జాగుసేయక పుడు నా కభయహస్తమిచ్చి నన్ను రక్షింపుము;
లెస్స

సీ॥ జగదేక ధీరయందు ♦ నగరాజు కడుపున
భువనముల్ ముదమొద ♦ వుట్టినావు;
మూఁకన్నులవాని ♦ మోహించి వాసికై
చండతర తపంబు ♦ సల్పినావు;
గడియయు కాంతుని ♦ విడిచి యుండఁగ లేక
శివుని సామేన వ ♦ శించినావు;
లోకకంటకులైన ♦ రాక్షసులను ద్రుంచి
ముజ్జగంబుల లీలఁ ♦ బ్రోచినావు;

గీ॥ ఆశ్రితకోటి బిరుదు ♦ నందినావు;
సాటిలేని మహా మహా ♦ శక్తి వీవు;
సర్వశక్తులు, నీకు న ♦ సాధ్య మేది;
నమ్మినాను బ్రోవది నీవ యిజ్ఞ ♦ పిలుపుకొనుము.

జయం—(ఆశ్చర్యముతోఁ దనలో) కాళికాదేవిని బూజించుటకా
యీమె యిచ్చటికి వచ్చినది! నేనెంత దురభిప్రాయపడితి!

భాను—ఓగౌరీ. నిదయు ఇంతవఱకును న్యాపై రాదయ్యె. నేను నా
ప్రభువును విడిచి యింకొక గడియయైనను బ్రతుకలేను. నీవు
మొక్కిట నిద్రపోవువాని కాళ్ళకు మొక్కుటే యయ్యె;
లాభము లేదాయె. ఇంతదనుక నాధవుఁడురా లేదు. నాప్రాణ

ములు నీయెదుటనే వదలెద. నాతుది వందన మందుకొనుము (నమస్కరించి)

శహానా - త్రిపుట.

సెలవిందు పోయెద - తల్లి దండ్రులారా!
తలంచకండీ నన్ను నా - తప్పులెల్ల మన్నించి॥ సె॥
చెలులారా! దయతో - సెలవిందు పోయెద;
కలసి మెలసి యింక - కాలము పుచ్చితిమి॥ సెల॥
ఆదరించి గావవే - అంబా! త్రిలోకాంబా!
నీదరికి ఇప్పుడే - నే వచ్చుచున్నదాన॥ సెల॥

(మొలనుండి చురకత్తితీసి పొడుచుకొనఁబోవును.)

కాళి—ఓ పతివ్రతాతిలకమా! ఆగుము మాకుఁగను నీపతిభక్తికి నే నమందానంద మొందితిని. నీభర్త త్వరలో వచ్చును; చింత పోకుము.

జయం—(కత్తి నేల జారవేసి యాశ్చర్యముతో చూచుచుండును)

భాను—(సాష్టాంగ దండప్రణామంబు లాచరించి లేచి)

దండకము అంబా! కృపాంబ! ఇందాది బృందారకానేక సద్గేయ నీక సంస్తుత్య మూర్గావలంబా! మునీంద్రాది భక్తాగ్రణీ స్వాంత చిత్తాబ్జ మార్తాండబింబంబ! దుర్దైత్యవిచ్ఛేద నోత్సాహ శూలిధ్రు ధ్రుమాకారంబా! మహాశౌర్య సంరంభ! మాయాంబ! నీ దామహాత్యంబు నెన్నంగ వేదవ్యాసుల్ గుల్కు శేషాహికెన్నరవంతే శక్యంబు కానప్పుడే నెంద దాగల్ ? మహాపాపినై; జేల; గర్వాంధురాలన్; కఠినన్; దొందరం జెందిదుర్భావల నోర్నరు నొవ్వంగ, హాపించితిన్, పాపమార్జించితిన్, గారి మన్నింపవే; కావవే; దాసురాలిం గృపం జూడవే; దానవం తాన నత్పారిజాతా! మహాశైలరాడ్గర్భ సంజాత! మాతా! నమస్తే నమస్తే నమస్తే నమః.

జయం—(సంతోషముతో తనలో) సెబాస్! ఈ రీతిగ మిన్ననాకర్థాం
గియగుటచే నేను తరించినాఁడ. నాయవమానమిప్పటికినిర్మూ
లమైనది. ఈమె నిజముగా పతివ్రత; మహాపతివ్రత: మహాపతి
వ్రత. ఇచ్చోట నేనుండరాదు. దాసురాలియెడఁగల ప్రేమా
తిశయముచే నీదేవి నన్నిమెకఁ బట్టియిచ్చిన నాగుట్టు బట్ట
బయలగు. కానఁ బైకిఁబోయెద. (పోవును)

కాళి—గుణవతీ! భానుమతీ? నీనేరంబులు మన్నించితి. నీకు నాయెడఁ
గల భక్తికి సంతసించితి. నీకేమి కావలెనో కోరుము.

భాను—శాంభవీ! దూరాలోచనము లేని యీ యబల యెట్టి
కోర్కులఁ గోరవలెనో తెలియకున్నది.

కాళి—మంచిది. ఈ యుంగరము నందుకొనుము. దీనివలన నీకు ముందు
మంచి లాభము కలుగఁగలదు (ఇచ్చును.)

భాను—(పుచ్చుకొని కన్నుల నద్దుకొనును)

కాళి—భానుమతీ! నీ వింటికి సుఖంబుగఁ బొమ్ము.

భాను—చిత్తము (పోవును)

జయ—(ప్రవేశించి) నా! పతివ్రతాశిరోమణీ! అగ్నిహోత్ర సమా
నురాలవగు నీయందు మలిన ముండునని దురభిప్రాయపడిన
యీ ముండ యెట్టి పాపము శమించుగాక! నిన్నింతకాల ముపే
క్షించిన యీ తుంటరకిప్పుడు బుద్ధివచ్చినది. నీవటి సద్గుణ
ఖనిని దుఃఖరూపంబునఁ దోసి, సన్యసించిన తలక్రిందుగాఁ
దపమాచరించినను, నరకప్రాప్తియే కాని మోక్షమబ్బదు.
అమాయకురాలవగు నీకన్నిటి నటువంటి నాతపఃపుణ్యా సాలం
బును వేశ్యతోఁ బెకలించివేయుదా? ఇపుడు నేని కాళికాలయం
బునఁ దెల్లవారువఱకుండి, ఈదుస్థితి నూర్చివచ్చి, ఈనాభాగ్య
లక్ష్మి భుజపజంబున హాయిగాఁ జేరి, దేవతలవలె నేనిట్లే

యౌవనవంతుడనై యుండుటచే, సుకుమారాంగి నిగూర్చి ఘోర
తప మాచరించెద. (పోవును.)

(తెర వ్రాలును.)

---

## ద్వితీయరంగము - శయనగృహము

[జయంతుఁడు మంచముపైఁ గూర్చుండియుండును.]

జయం—(తనలో) నా జయలక్ష్మి యింకను ప్రత్యక్షము గాకున్నది. ఎందుచేతనోగదా! ఈ వేళ వచ్చి సిగ్గుచే నేమూలనైన నక్కి యున్నదా! (ఇటునటు చూచి సంతోషముతో) అదుగో! చెలికత్తెలతోఁ గలసి కనకగుమ్మమువఱకు వచ్చి, పాడుసిగ్గు కాళ్ళ సంకెలలై బాధించుచుండుటచే ముందుకు రాలేక కంబముల బిగ్గఁ గౌఁగిలించుకొనుచు, చెలులు చేతిపట్టు తప్పించుటచే నీలిగిలఁబడుచు, నెచెలులఁ గసరుచు, మూలమూలలఁ దూఱుచున్నది దగ్గఱబడినది. ఇంక వచ్చును.

ఖాను—(ప్రవేశించి ముఖము దించి నిల్చుండును.)

సీ॥ మహిత కళాశాస్త్ర • మర్మంబులను నాకు
  తెలుప వచ్చిన రతీ • అదిగో;
సంసార ఫలరుచిఁ • జవి చూపఁగా నాకు
  విచ్చేసిన అమర్త్య • వేశ్య యదిగో;
మునివృత్తిఁ బూనఁ గో • రిన నామదిఁ గలంపఁ
  జను దెంచిన మరుని • శస్త్ర మదిగో;
నా భావికాలాశ • నవసుఖేందుఁడు తోఁప
  జూపట్టు మేల్వేగు • చుక్క అదిగో;
గీ॥ వాసిగనిన నా నోలినోము • పంట అదిగో;
భాసురమగు నాధారాణి • స్వర్గ మదిగో;

భాను—(నవ్వుచు) పాపము! మిమ్మింత శ్రమపెట్టుటకు నాకిష్టము
లేదు. పైఁజెప్పిన కఠినశిక్షల దాము భరింపఁగలరా?

జయం—ఏమిచేయుదును? కష్టములువచ్చినపుడు భరింపక తీఱునా?

భాను—మగవారు మిగుల సమర్థులు. చేలలగు మగువల మాట
లచేఁ బొంగించి సఫలీకృత మనోరథు లగుదురు.

కాంబోది - రూపకము.

ఇన్ని రోజులకు నాపై - హృదయేశా! దయ వచ్చెనా!
కన్నులు కాయలు కాచెఁ - గాచికాచి మీరాకకై! ఇన్ని
కాంతుఁ డవజ్ఞ చేసిన - కాంతజన్మము వ్యర్థము;
ఇంతకుఁగా మగవర - లెన్నగా స్వార్థపరుల్॥ ఇన్ని॥
పనియున్నఁ దియ్యని - పలుకులు పల్కుచుందురు;
పనిలేనప్పుడెంత - ప్రార్థించిన గారుగ॥ ఇన్ని॥

జయం—సుందరీ! క్రూరస్మరశరవారంబునకు గుఱియై శోకపారీణం
బులతోఁ గాపాడుము వను నాశతో నిన్ను జేరితిని. శరణఁ
దూరినవాని రక్షించుటకు బదులుగా. పరుషవాక్యాలంబుల
నెత్తిపొడుచుట పతివ్రతకు ధర్మముకాదు సుమా.

భాను—నన్నెప్పుడు నిఁక విడిచిపెట్టరు కదా?

జయం—కాంతారత్నమా! వెనుకఁ దెలివితక్కువచేత నిన్నుపేక్షించి
నందు కిపుడు విచారించుచున్నాఁడ. కన్నులార నీసుగుణ
రూపాతిశయంబులఁ జూచిన తరువాత నిను విడిచిపెట్టుట
నేను మందమతినఁటె?

సీ॥ మోహనాంగిరో! నీదు ముద్దుమోమునుగన్న
పాపంబు లన్నియు ♦ రూపు మాయు;
కామినీ! నీదు వాల్గన్నులఁ గాంచిన,
వృద్ధున కైనను ♦ పిచ్చియెత్తు;
బోటిరో! నీదు కె ♦ మ్మోవిని చూచిన,
ఎట్టి దిట్టరికైన ♦ లొట్టలిడును;

భామినీ! నీ తను ♦ లావణ్య మరసిన,
వైరాగ్య మంతయు ♦ పాఱిపోవు
గీ॥ భర్తృ వాక్సుధలను జరా ♦ భరము దప్పు;
చెలిమి యబ్బిన రోగముల్ ♦ చేర వెఱచు;
ఈవు దయనేలు పుణ్యాత్ము ♦ నెన్న వశమె
బ్రహ్మకైనను మఱి వాని ♦ బాబుకైన?

భాను—'నిన్నెప్పుడు విడువ' నని నాచేతిలో చేయివేసి చెప్పెను.

జయం—ఈ బొందిలో ప్రాణము లున్నంతవఱకు నిన్ను నేనువదలను.
(చేతిలోఁ జేయివేయును)
(ఒకరి నొకరు కౌఁగిలించుకొందురు.)

జయం—(భానుమతి నొక యాసనముపైఁ గూర్చుండఁజేసి తానొక దానిపై గూర్చుండి) కోమలీ! ఈమాటను క్రమము చేయుము. (ఇచ్చును.)

భాను—నాథా! ఇందేమున్నది?

జయం—తరువాత చెప్పెదను.

భాను—చిత్తము. (ఒక మూలకుపోయి నాఁడి వచ్చును.)

జయం—సుందరీ! మఱేమి వింతలు?

భాను—(మందహాసముతో) మీకుఁ దెలియని వింతలేమున్నవి? నాక మిద్దఱమీవేళఁ గలసికొనుటే గొప్పవింత. (తమలపాకు చిల్కలనిచ్చును)

జయం—(అందుకొని వేసికొనుచు నవ్వును)

భాను—ఏల నవ్వుచున్నారు? నేను చుట్టిన చిలుకలు బాగుగా లేవా?

జయం—బాగుగా లేకేమి? రతిచేతి చిలుకలవలె నున్నవి. ఎట్టిధైర్య స్థైర్యాదులుగల పురుషుఁడైన స్త్రీ చేతికిఁ జిక్కిన, ఈ తమలపాకులవలె ఎటుమడఁచిన అటు మడఁచియుండును గదా యని నవ్వవచ్చుచున్నది.

భాను—(నవ్వుచు) కాంతలు వలంతులు. కాంతు లలం[illegible]లని మా
మీయభిప్రాయము?

జయ—అందుకు సందేహమేమి?

గీ॥ ప్రేమ యను సున్నమునకు రాఁచి, ♦ పిదప ధీర
కాదులను ప్రక్కటియానెల ♦ నన్నదీసి,
స్వేచ్ఛయను పెద్ద యీనెనా ♦ వెన్నలాగి,
పురుషుఁడనెడు తమలపాకుఁ ♦ బూవుఁబోండ్లు
మనసువచ్చిన తీరున ♦ మడఁచుచుంద్రు.

భాను—పాపము! పురుషు లెంతయమాయకులు! ఇఁక మీరు నను
చెప్పినట్లే చేయుదురు కాఁబోలు?

జయం—అది ముందు తెలియఁగలదు (ఆకులు వేసికొనుచుండును)

జయ—(మూలనుండి పైకివచ్చి కన్నులు నలుపుకొనుచుఁ దనలో)
ఇదేమి? మంచముపై నాప్రియు ప్రక్కలో పరున్ననేను మూల
కెట్లువచ్చితిని? నిద్రలో దొర్లి క్రిందఁబడితినా? ఆగయ్యాళి
నన్ను క్రిందకి త్రోసివేసినదా? (లేచిచూచి యాశ్చర్యముతో)
ఔరా! ఏమి నాకలవరము? కలగనుచున్నానా యేమి? (కన్నులు
తుడుచుకొని చూచి) అక్కడ ఇద్దరు మాటలాడుచున్నట్లు
న్నదే. అదొకతె నాభార్య మిగిలిన మానిసియెవరు?...
ఓసీ! పిశాచమా! ఇటుమగనిఁ గ్రిందికిత్రోసివేసి ఇంకొకమగ
నితో హాయిగా సరసమాడుచున్నావా? నాకన్నుల దుమ్ము
గొట్టితివా? ఔరా! కామాంధా! నీభార్యలో తృప్తినొందక
యీ యెంగిలి పదార్థంబునకాశపడి కుక్కవలె చచ్చుటకా
వచ్చితివి? కాచుకో (కత్తితీసి) పరదారకాంక్షగల నీకుఁ దగు
శాస్తి యిదే పుచ్చుకొనుము. (పొడిచివేయును.)

జయం—హా! చచ్చితి (నేలఁబడి ప్రాణములు విడుచును.)

భాను—(త్రుళ్ళిపడిలేచి) ఎవఁడవురా నీవు? ఇక్కడ కెందు కిట్లు
వచ్చితివి?

జగ—...నన్నింత నిర్భయముగా యాదికి వచ్చితివా? నే నెవఁడనో తెలియ గవా? నీ యింటిమగఁడను.

భాను—ఛీ! మూర్ఖా! నోరుమూసికొనుము. లేనిచో వండ్లూడ గొట్టించెదను.

జయ.—ఆ! ఏమి పిలుచున్నావు? (దగ్గఱకు పోవుచు.)

భాను—(బిగ్గరగా) నాథా! నన్నెవ్వఁడో చెరపఁబట్టుచున్నాఁడు. కాపాడుఁడు లెండు లెండు (పైఁబడి యిటునటు కదిపి చూచి హా! నాథా! (జయపాలు నుద్దేశించి) ఓరీ! మహాపాపీ! ఈ యన నీకేమి యపకారముచేసెనురా? (లేచి) అమ్మా! అమ్మా! చెలులారా! నాపతి నెవఁడో క్రూరుఁడు చంపివేసి నాఁడు రండు, రండు. [ఇటునటుఁ బరుగెత్తును.)

జయ—(నిదానించిచూచి యాశ్చర్యముతో) ఈకాంత యెవరు? నా భార్యకాదే. ఈమందిరముకూడఁ గ్రొత్తగాఁ గనబడుచున్నది. నేనిచ్చటి కెట్లు వచ్చితిని? (పైకి) అమ్మా! నమస్కారము. నాతప్పుక్షమింపుము. నీ వెవరవు?

భాను—నేను సత్యసంధుని కుమార్తెను; సుమంతుని కోడలను

జయ—(ఆతురముతో) ఏమి? సుమంతునికోడల వా? ఆయన దేయూరు? ఏమియుద్యోగము?

భాను—మధుపురాధీశ్వరుఁడవు ధనపాలునిమంత్రి ఆయనకుమారు డీయన.

జయ—సుమంతునికుమారుఁడు జయంతుఁడా యితఁడు?

భాను—అవును, ఆయనే, హా! ప్రాణేశ్వరా! (మూర్ఛిల్లును.)

జయం—అయ్యయ్యో! నాజయంతుఁడేరా? (కత్తి నేలబార వేసి దగ్గ ఱకువెళ్ళి చూచి) హా! జయంతా! జయంతా!! (చతికిలఁబడి) హా! హాతవిధీ! నాచే నాప్రాణమిత్రుని చంపించితివా!

సీ॥ అన్నదమ్ములరీతి ♦ అరమర లేకుండ,
పిన్నటనుండియు ♦ పెరిగినాము;

ఒకకంచమందున ♦ ఒకపంచమందున
భుజియించి నిద్దుర ♦ పోయినాము,
ఒకపఠశాలలో ♦ ఒక్కగురుని యొద్ద
శ్రీకరకళ లభ్య ♦ సించినాము;
రామలక్ష్మణులట్లు ♦ లే మంచిచెడ్డల
ఎడబాటు లేకుండ ♦ మెలగినాము;
గీ॥ నాఁడు పాతిచెడి నిను తూల ♦ నాడ, అలిగి
పాఱిపోతివో నన్నుఁబాసి ♦ ప్రాణసఖుఁడ!
అక్కటక్కటా! దుఃఖాబ్ధి ♦ యందు నన్ను
ముంచి బాధింప నీవస్త ♦ మించినావె?

హా! గుణవంతా! జయంతా! కలనైన, ఇంతఘోరము జరుగు నని మన మనుకొనలేదుగదా. నన్న న్యాయముగా నిందించిన దుః నే నెంతయో చింతించి, సాధ్యమగునంత త్వరలో నిన్ను క్షమాపణ కోరుకొన నాతురపడుచుంటినే! ఇఁక ఎవరిని క్షమాపణ కోరుదును? నిన్ను వెదుక యెందుఁబోదును? హా! నేస్తమా! మా పిల్లఁడేడని నీదల్లిదండ్రులను నీ మిత్త్రుఁడు జయుఁతుఁడేడని పౌరులును, నన్నడిగిన నేనేమని చెప్పుదును? ఈ మహాపాప మెట్లు ధరింతును? ఇదితప్పుట కేమొనరింతును?

భాను—నీవెవరవు? ఇక్కడ కెట్లు వచ్చితివి?

జయ—సాధ్వీరత్నమా! నేను ధనపాలుని కుమారుఁడ. మహాపాతకుఁడ. జయపాలుఁడ. ఇక్కడ కెట్లు వచ్చితినో నాకును తెలియదు,

భాను—హా! మనోహరా!

హిందూస్థానీ బైరవి—ఏకతాళము.

నను విడిచి పోతివే - నా పాదోధనమా!
వినుమే నీవెంటనే - వేడ్కతో వచ్చెదను! నను॥
చేతికిఁ జిక్కినమణి - చేజాఱిపోయినది;

నాతలవ్రాలా? లేక - నాకొఱనోముఫలమా॥ నను॥
పతి నొంతనే యుంటట - సతికి విధి కావున
కోతుకక నన్నుగూడఁ - గొనిపోఁను; వచ్చెద॥ నను॥

(జయచంద్రుని కంఠము చేతిలోఁ నదుముచుఁ దనలో) ఇదేమి?
ఉంగరపుఱురక్తముతోఁ దడిసియున్న గళము మునుపటివలెనే గాయమే
లేక గపడుచున్నది. బాష్పపూరితంబులగు నా కన్నులు పొరఁబడు
చున్నవి. (పైటకొంగుతోఁ కన్నులనద్దుకొని చూచి సంతోషముతో)
నిజముగా గాయమే లేదు ఏమి వింత! (చేతులుచూచుకొని) ఆఁ!
తెలిసినది జగదంబ ప్రసాదించిన యుంగరపు ప్రభావమేయిది. (సం
తోషముతో) నాథా! నాథా!!

జయచం—ఉఁ! అబ్బ! ఏమే! (ఒత్తిగిలి పరుండును.)

జయ—(తనలో) ఛీ! నిష్కారణముగ ప్రాణసఖునిజంపి యేమొగ
ములో బ్రతికియుందును?

గీ॥ కడుపుమంటకు తాళహా ♦ పడుచు దృష్టి
పోవఁ గనిపగుబిడ్డను మ్రింగు భు ♦ జగిభంగి;
కోపమున మైమఱచి దృష్టిఁ ♦ గోలుపోయి,
ప్రాణమిత్త్రుఁ జంపితి ♦ అక్కటకట?

మిత్రరత్నమా! ఇదిగో నేనుకూడ నీకడకు వచ్చుచున్నాఁడ.
(కత్తి తీసి నఱకుకొనఁబోవును.)

భాను—రాజకుమారా! తొందరపడకుము. నీసఖుఁడు సజీవుఁడై
యుండ, నీవు ప్రాణత్యాగమేల చేసికొనెదవు?

జయ—నాచెలికాఁడు బ్రతికియేయున్నాఁడా? నీకు మతిపోయినది;
పొమ్ము నాపని కడ్డురాకుము.

భాను—నిజముగా నేను బ్రతికించితిని.

జయ—నీవు చనిపోయినమగని సావిత్రివలె బ్రతికించితివా? పోపో,
వెంగలీ! ఎట్లు బ్రతికించితివి?

భాను—వెనుక దుర్గ నాకు ప్రత్యక్షమై యీయమృతఘటికరము నిచ్చి దీన నాకు మంచిలాభము కలుగునని చెప్పినది. ఇప్పుడు నేను నాభర్తకైఁబడి యేడ్చుచుండ, ఈయుంగర మాయన కంఠమునకుఁ దగులుటచేఁ బునర్జీవితుఁడయ్యె!

జయ—అలాగుననా! ఏదీ? లేవుము.

భాను—మంచిది. నాథా! లెండు లెండు. మీమిత్రుఁడు జయపాలుడు వచ్చెను.

జయం—(దిగ్గున లేచి) నామిత్రుఁడు జయపాలుఁడు భూతమై వచ్చి నిన్ను బాధించుచున్నాఁడా?

జయ—(ఆశ్చర్యముతో) ఔరా! ఏమీవిపరీతము! వా! పతివ్రతారత్నమా!

భాను—నన్ను బాధించుటలేదు మిమ్ము చంపివేసినాఁడు.

జయం—నన్నుచంపివేసినాఁడా! వెఱ్ఱిపిల్లా! కలగనుచున్నావు. నేను బ్రతికియున్నాఁడ గదా; పరుండుము.

భాను—నేను కలకనుట లేదు మీకు నామాటలనమ్మకము లేకున్న అటు చూడుము. (చూపును)

జయం—(చూచి యాత్రముతో) ఇదేమి? సఖా! పాముపలెపగడపట్టి చచ్చియు నిర్దోషినగు నన్ను బాధింప భూతమైతివా?

జయ—హా! జయంతా! ఎన్నాళ్ళకు నాకంటఁబడితివి? (దగ్గఱకు వెళ్ళును.)

జయం—ఆఁ! ఆఁ! ఆఁ! (వెనుకకుఁదగ్గి) సుందరీ! చూచెదవేమి? కృపాణ మందుకొనుము (పరుగిడును)

జయ—(వెంబఁబడి) ఏమట్లు భయపడుచున్నావు? నీమిత్రుఁడ జయపాలుఁడనుగాని భూతమునుగాను (కత్తిపాఱవేసి) ఇఁక నీభయము తీఱినదా?

జయం—కన్నులార నీచావును జూచిన నన్నే బూకరించెదవా?

జయ—చాల బాగుగనున్నదే. చనిపోయినవాఁడవు నీవుకాని నేను
కాను. నిన్ను కత్తితో పొడిచి చంపితిని. కత్తి రక్తముతో నిండి
యున్నది, చూడుము. (కత్తితీసి చూపును.)

జయం—ఏమి యీమాయ? సత్యముగాను నీతో మాటలాడుచున్న
నన్ను నీవు చంపితివా? చంపిన నేను బ్రతుకుదునా?

జయ—ఆ! అలాగున దారికిరమ్ము. సాధ్వీ తన్మనగు నీ సతి గౌరీప్రసా
దంబున లభించిన అమృతపుబంగారము చేత నన్ను బ్రతికించెను.

జయం—సుందరీ! నిజముగా నన్నితడు చంపెనా? నీవు నన్ను
బ్రతికించితివా? ఆయుంగరమేదీ?

భాను—అప్పనవును. ఇదిగో యుంగరము. (చూపును)

జయం—(పెన్ని చదువుచు) సెబాస్! కాంతా! సెబాస్! (జయ
పాలుతో) నీవెట్లు బ్రతికితివి?

జయ—నేను చనిపోయినఁగదా నీకట్లు ఋజువగుటకు?

జయం—ఇది బాగుగానున్నది. నీవడిగిన మేదరవాని మరఁగి నాటి
రాత్రి నన్ను వాని పొత్తాంతరంబునఁ జపినేయ, బైరాగి
వేషమున నీవెటువచ్చి నేను నీయెముకల గంగలోఁ గలుప
దీసికొని వచ్చితిని.

జయ—సరే. నీవుపుడు చెప్పిన దంతయు నిజమనుకొందము. ఏవీ?
నా దుమ్ములు చూపుము.

జయం—ఇదిగో చూపెదను సుందరీ! మూటపదీ?

భాను—ఆమూలఁ బెట్టితిని

జయం—(వెళ్ళి మూటవిప్పి వెదకి చూచుచు దనలో) ఏమైనవి?

జయ—(నవ్వుచు) అధర్మపత్నీ పరిత్యాగంబున బ్రతికితివే కాని నీకింత
కను తెలివి బాగుగా రాలేదు. ఇంకను బలవంతించుచున్నావు!

జయం—ఈ చేతులతో నిదుమ్ముల నెత్తి తెచ్చిన నన్ను భ్రమింపఁ
జేసెదవా? (ఆలోచించి) ఔలీ! మాట. నిజము చెప్పుము. నే
నీగదిలోని కేదనమూట తెచ్చితినా లేదా?

భాను — తెచ్చినారు. నాచేతికి దాచుమని ఇచ్చినారు

జయం — ఆ! అవునవును. నీవు దానినెక్కడ పెట్టినావు?

భాను — ఆమూలఁ బెట్టినాను.

జయ — ఆమూటయందేమున్నదో నీ వెఱుంగుదువా?

జయం — సతీమణీ! ఇంకెందుకు? చెప్పుము. నేనేమియు అనను లే.

భాను — అందు మనుజుని అస్థులున్నవి.

జయ — నీ కెట్లు తెలియును? నీ కీతఁడు చూపినాఁడా?

భాను — (జయంతునితో) నాథా! మీమాట మీఱినందుకు క్షమింపుఁడు. (జయపాలునితో) అయ్యా! ఈయన ఆమూటయందేమున్నదో చెప్పకుండ దాచుమని నాకిచ్చుటచే, అందేమియున్నదో చూడవలెనని ఆమూలకు వెళ్ళి మూటవిప్పి చేయి పెట్టఁగానే దుమ్ములు తగిలినవి. నేనందుల కాశ్చర్యపడి యప్పటియట్లు కట్టి పెట్టివేసితిని.

జయం — (సంతోషముతో) ఆఁ! తెలిసినది వయస్యసత్తమా! ఈమె యూర్మిక పరిభావమున నేనెట్లు బ్రతికితినో యట్లె నీదుమ్ము లీమె తాఁకుటచే నీవు పునర్జీవితుండవైనాఁడవు. తెలిసినదా? లేకున్న నీవీ జయంతిపురంబున కెట్లు రాఁగలవు? చెప్పుము.

జయ — గరితలమిన్నా! నీ విపుడాడిన మాటలు సత్యమేనా?

భాను — సత్యము, సత్యము, ముమ్మాటికి సత్యము.

జయ — అహో! పతివ్రతా శిరోమణీ! మదీయ ప్రాణప్రదాయినీ,

ఉ॥ అమ్మరో, పేమనందుకొనవమ్మ మదీయ నమస్కృతావళిన్
గ్రిమ్మఱి నాహితోత్తముని కన్నులపండువుగాఁగఁ జూడ బ్రా
ణమ్ముల నిచ్చినావు; నిను నాయికగాఁ గొనియున్న వీని భా
గ్యమ్ము నుతింప వీల్పడదుగాదె? సతీజనతావతంసమా!

భాను — అయ్యా, నన్నింతగా పొగడెద రెందులకు? తమ ప్రాణదాత ఆయన.

జయ—మిత్రరత్నమా, (కౌగలించుకొని) నాఁడు దురభిప్రాయపడి
నిన్ను తిట్టి తగిలివేసినను, కోపింపక నన్విడువలేక నావెంటవచ్చి
నాడున్ను గంగలోఁ గలువఁదెచ్చి బ్రతికించిన నీకేమి
ప్రత్యుపకారము చేయఁగలను?

జయం—నా చెల్లీ, ఇకనంతయు ఆ నాఁడు మనము కలిసికొనిన వేళావిశే
షమే కాని నీతప్పు కాదు. నేను చేసినది నావిధియే గనుక
నదానిఁ గూర్చి మాత్రము నీవు చింతింపకుము.

జయ—నేస్తమా, నీబోటి సుద్గుణులు త్రిమూర్తులకైనఁ జిక్కుట
దుర్లభంబుగదా! నా యదృష్టమేమందును? అపకారికి నుప
కారము చేసి బాసినీనిగాఁ జేసికొనవచ్చునుగదా!

జయం—ఓయీ నన్ను వెక్కిరించుచున్నావా? ఎందుకీస్తోత్రములు?
నేను చేసినది నావిధికాని ఉపకారమెంతమాత్రమును కాదు.
మఱియు, కష్టకాలమున నిన్ను కాపాడలేనందుకు కుందు
చున్నాను

జయ—మొదట నోడిపోయినను చివరకు గెలిచినావు. చాలదా!
నీవిచారము దూరముగా పారఁదోలవేసి నన్ను చంపుకొని
తినినట్లే

జయం—నన్ను మాటమాటకు పొగడుచుండుటవేని, నన్ను నీవు చంపు
కొని తినినట్లు.

జయ—సరే, మానివేసెదను.

జయం—నేనును మానివేసెద. కాంతామణీ! నీ సుగుణాతిశయంబు
లేమనికొనియాడుదు?

భాను—ఇది బాగుగానున్నది నన్నెందుకు పొగడరు? ఆయనవంతై
నది గదా! మీవంతుండిపోయినది కాఁబోలు?

జయం—

ఉ॥ ఇంతుల మేలుబంతి, నిను హెచ్చుగు కష్టదవాగ్నిఁ ద్రోయ, ఆ
వంతయు ధైర్యలక్ష్మి విడనాడక, పైఁడిసలాక రీతిగా

శాంతముతోడ నొప్పెంచి, అలశాంకరిం గొల్చి వరంబు దీని
స్వాంతయు నుద్ధరించి వహీం యశంబును గాంచితివహో!

(దేవు నుద్దేశించి) పరమేశ్వరా! నీయనుగ్రహకారుణ్యాతిశయం బున, ప్రాణమిత్రుల మిరువురము విడిపోయి చచ్చి బ్రతికి తిరిగి కలిసికొంటిమి. ఇంతకంటె మాకింకగావలసిన దేమున్నది? అయినను లోకోపకారార్థ మిట్లగుంగాక!

భరత వాక్యము.

ఉత్సాహ॥ ఓలలాడుచుందురింగాక ఉరుసుఖాబ్ధిం బ్రాణమి
త్రాళి నిరత మడ్డులేక; అఖిలవెల్ల భర్తక
చాలభక్తిం గొలుచుచు న్నశంబుగాంతురింగాక; సు
శ్రీల శ్రీకరార్థిసమితి చెందుంగాక నిచ్చలున్

సమాప్తము.



# లోభి



★

గ్రంథకర్త:

కీర్తిశేషులైన మహాకవి

## శ్రీ పానుగంటి విజయ రాఘవరావుగారు

సకల గుణాభిరాముడు లోభి - వడ్డీలకోసం వేదవాక్యాలు సంపద కోసం సంఘసంస్కారాలు, - అసలీ ఫాయిదాల వసూలుకోసం ఆప్త వాక్యాలు, - కనకంకోసం కునకచేష్టలు, వృద్ధవివాహాలంటే ఉబలాటం - స్త్రీవిద్యంటే చీదరింపూ, పేదవాళ్ళంటే బెదరింపూ, కన్న కొడుకంటే కొలుకొలులు, కన్నబిడ్డలంటే కంటగింపు, ఆశ్రితులంటే యేవగింపూ, నౌకర్లని బెదరింపూ, అందరిమీదా అనుమానాస్త్రాలు. అతి తెలివితేటలు, అభియోగాలు అన్నీ మూర్తీభవించివున్న నాటకం లోభి. షోకేశాలంటే అతని కంటికి చవట పీనుగులు. సనాతనధర్మం బుద్ధికిచవిటి నేల, కరుణరసం అతనికి కంటికలికం, వితరణ గుణం అతనికి ప్రబలవిరోధి, అనుమానం అతని సొమ్ము, అబద్ధాలు అతని ఆత్మ, అసత్య ప్రమాణాలు అతని పంచ ప్రాణాలు, ఖర్చు అతనికి కంఠపాశం, విద్య అతనికి ఉరితాడు, లోకం తన కుపకారం చెయ్యాలి. తను లోకానికి అపకారం చెయ్యాలి. అందుకే అతడు అవతరించాడు.

అద్భుత సంఘటనలతో, ఆదర్శసన్నివేశాల్తో ఆనందరసాన్ని ఒలికించే సంభాషణలతో, చక్కని వ్యవహారిక భాషలో వ్రాయబడిన సాంఘిక నాటకం. నాటకప్రదర్శనాలకీ సినిమా చిత్రనిర్మాణానికి అనుగుణ్యమైన నాటకరాజం. లోభిప్రయత్నాలు ఫలప్రద మౌతాయో, తారుమారౌతాయో, ఒకప్రతి కొని వెంటనే చదవండి పానుగంటివారి రచనా సమర్థత ఈనాటకంలోకూడా ప్రతిభ గాంచింది. కొలది ప్రతులు మాత్రమే ముద్రించినాము. త్వరపడుడు!

వెల 1—8—0

Printed at P. N. MOORTY PRESS Bezwada